కాని ఓడ యిక పోవలసియున్నది తెల్లవారనున్నది. ఆదియే సమయము. ఈ తరుణము దాటిన నిక నిరుపయోగము.

అతడు రక్షకభటులను బిలిచి బయటికి పోవలయునని జెప్పెను. వారు ప్రధానోద్యోగిని లేపిరి అతడుగూడ ఖుషీతో వచ్చెను సావర్కారు స్నానముచేయు గదిలోనికి బోయెను. ఆ గదికొక యద్దము మర్పబడెను. రక్షకభటులు పైనుండి యాతడు లోపల నేమిచేయుచున్నదియు నొక భూతద్దముతో జూచుచుండిరి సావర్కారు కీపం గతియంతయు దెలియును. అతడటునిటు జూచెను అందులో నతని కొక రంధ్రము గాన్పించెను. కాని యచ్చటకు బోవుటెట్లు? రక్షకభటు లతనిని సైతానువలె జూచుచున్నారు. అతనియొద్ద నొక యంగరకా మాత్రమున్నది. దాని నతడా యద్దముపద్ద నున్న కొయ్యకు దగిలించెను. ఆది యద్దముపైబడి రక్షకభటుల దృష్టి కడ్డమువచ్చెను. ఇదే సమయమనుకొని సావర్కా రా రంధ్రములోనికి దుమికెను. ఈవూరుకూడ నతడు తప్పిపోయెను. [illegible] లజ్జా, భయము లతనిని [illegible] వెంటనే ధైర్యమును దెచ్చుకొని "శ్రీ[illegible] నిశ్చయమునకు సాధ్యపడదు." అని [illegible]కొని మరల ప్రయత్నించి రంధ్రము లోనికి దుమికెను. ఈసారి రక్షకభటుల దృ[illegible] పెట్టికి వెంటనే వారు తలుపుగుంజిరి. కాని సావర్కారు [illegible] గడియ వేసికొనెను. వారు తలుపులను బగులగొట్టిరి ఏమిలాభము! సావర్కారప్పుడే సముద్రములోనికి దుమికెను. రక్షకభటు లతనితో దుముకుటకు సాహసింపలేక పోయిరి వారు వెంటనే రివాల్వరులను బేల్చిరి సావర్కారా చప్పుడు విని నీళ్లలోమునిగి యీదుకొని బోవుచుండెను. వెంటనే స్టీమరు మీదనుండి యొడ్డునకు వంతెన వేయబడెను. ఓడలోని జనమును, యుద్యోగులును గొల్లుమని క్రిందకురికి నలుదిక్కులు పరుగెత్త నారంభించిరి. సావర్కారు కొంతసేపు మునిగి వారికి గాన్పింపకుండ బోవుచుండెను. ఇట్లతడు ఫ్రెంచితీరమును జేరెను. కాని తీరమునుండి సముద్రములోని కెత్తైనగోడ కట్టబడెను ఆగోడలను దాకివచ్చో ఫ్రెంచితీరములను జేరవచ్చే, ఆంగ్లేయోద్యోగులును తదితరులును కేకలు వెట్టుచు తరుముకొని వచ్చుచుండుట నతడు చూచి తీరమునకెక్కి పా

పోవలెనని గోడల కెగబ్రాకెను కాని మొదటిసారి విఫలమనోరథు డయ్యెను. మిత్రమేల సంఘసభ్యు లందరును వీరపరిశ్రమలం దారితేర వలెనన నొకవిధి యుండెను. ఆవిధిప్రకారము నాయకుడైన సావర్కారుకూడ కొండల నవలీలగా లంఘించుచుండెను. అదియే యిప్పుడతనిని రక్షించెను అతడు రెండవసారి ప్రయత్నించి తీరముజేరెను. శత్రుపాశములనుండి తప్పించుకొంటినను జ్ఞాన మతని యా వేదనను తగ్గించెను. అతడు ఫ్రాన్సుతీరపు స్వాతంత్ర్య వాయువుల బీల్చెను. అవి వానికి హాయిగొల్పెను! కాని యుద్యోగులింకను వెనుకనుండి తరుముకొనివచ్చుచునే యున్నారు. "దొంగను పట్టుకొనుడు" "దొంగను పట్టుకొనుడు" అని వారు కేకలిడుచు, నట్టహాసముచేయుచు సావర్కారును సమీపించుచుండిరి. మూక యంతకంతకు హెచ్చుచుండెను. ఉద్యోగుల ధోరణి జూచిన ఫ్రెంచితీరమును చేరిన మానవునకు ఫ్రెంచిన్యాయమే వర్తింపవలెనను న్యాయమును గాలి కెగురగొట్టి దౌర్జన్యమును బ్రయోగింపనున్నారని యతడు గ్రహించెను శత్రువు లతనిని మూడు వైపులనుండి ముట్టడించుచుండిరి అతడు జీవరవరకు బోరినగాని లాభము లేదని గ్రహించి ఫ్రెంచిపోలీసు లెచ్చటనైనను గాన్పింతురేమోయని యిటునటు జూచెను ఒక్కడును గాన్పింపరైరి! సముద్రపుటీత; గోడల కెగబ్రాకుట; మృత్యుదంష్ట్ర కరాళమునుండి తప్పించుకొను సాహసకార్యములలో నుండు గుండెదడ; మొదలగు నన్నింటిచేత నెంతయలసియున్నను. క్రూరమృగపంక్తిచే దరుమబడు లేడివలె నతడు రిపువ్రజబరు వెత్తజొచ్చెను ఇట్లతడొక మైలుదూరము వరకు బరుగెత్తెను. ట్రాముబండ్లు పోవుచుండెను. అతడు వాటిని సమీపించెను. కాని యేమిలాభము! ఒక్క స్నేహితుడైనను కాన్పింపలేదు! అతనివద్ద నొక్కపైసయినను లేకుండెను. ఒక్క పెన్నియున్నచో నతడు శత్రువింకను జాలదూరమున నుండగనే ట్రాములో నెక్కి యుడాయించెడివాడు! ఒక్క పెన్నీ! ఒక్క పెన్నీ! సావర్కారును రక్షించుటకొక పెన్నీ చాలును! కాని ఆపెన్నీ నిచ్చువారెవరు! మాతృదేశమును, దనప్రజలను వీడి,, దేశముకాని దేశములో ననేకవేల మైళ్లదూరమున సాయుధపాణులైన విదేశీయులచే దన మాతృదేశశృంఖలావిచ్ఛేదముకొరకు కాతడొనర్చిన మహాపరాధమున కడవిమృగములచే

వేటాడబడు హరిణశాబకమువలె వేటాడబడుచున్న యీభారత యువకున కొక్క పెన్నీ నిచ్చువారెవరు! ఒక్కడును గాన్పింపడు!

కొంతమంది ఫ్రెంచికూలీలు దమతమపనులకు బోవుచుండిరి. "దొంగను పట్టుకొనుడు" "దొంగను పట్టుకొనుడు" అను కేకలువారికి వినిపించెను. చింకిగుడ్డలను ధరించిన యొకయువకుని రజిత, స్వర్ణధారులైన నాంగ్లోద్యోగులు దరుముకు వచ్చుటను జూచి యతడొక స్టీమరు లాస్కారయి యుండుననియు, నేదియోతస్కరించి పారిపోవు చున్నాడనియు వారు తలంచి తాముకూడ వానిని దరుమనారంభించిరి కాని సావర్కారుచిరులేడివలె పరుగెత్తుచు "పోలీసు" "పోలీసు" అని బిగ్గరగా కేకలిడెను ఫ్రెంచియధికారుల చేతులలో బడకుండగనే తన్ను బలవంతముగా నెత్తుకొని పోవలెనని యాంగ్లాధికారు లాశించుచున్నట్లు సావర్కారు కనిపెట్టెను ఇంతలో నొక ఫ్రెంచి పోలీసు సావర్కారుకు గాన్పించెను. సావర్కారు వానిని సమీపించి తాను దొంగకాననియు, తానొక భారత రాజకీయ ఖైదీయనియు, ఫ్రెంచి తీరమును జేరుటతోనే యతను స్వతంత్రు డయ్యెననియు, నాంగ్లోద్యోగు లతనిని బలవంతముగా నిర్బంధించి తీసికొని పోజూచుచున్నారనియు, వెంటనే తన నొకమేజస్ట్రీటునొద్దకు తీసికొని పోవలసినదనియు వచ్చియురాని ఫ్రెంచిభాషలో నతనికి జెప్పెను అమామూలు వీధిపోలీసున కింతపరిజ్ఞాన మెక్కడగలదు! ఇవేవియును వానికర్థం కాలేదు! ఇంతలో నాంగ్లోద్యోగులు వచ్చి సందేహించుచున్న యా పోలీసువానిపై వెండి, బంగారములను గుప్పిరి, దానితో పోలీసు కన్ని సందేహములును పోయి సావర్కారు నాంగ్లాధికారులకు వప్పగించెను. కాని సావర్కారుమాత్రము సాధారణముగా లొంగువాడు కాడు. అతడు వారి నందరను ధిక్కరించి చివరవరకును బోరుచు బలవంతముగా డజనులకొలది మనుష్యులుబట్టి స్టీమరులోనికి లాగుకొని పోవువరకును బోరుచునేయుండెను. ఇంతలో నొక యుద్యోగి వెనుకనుండి సావర్కారు నెత్తిమీద నొకవ్రేటువేసెను. అతడు రివ్వున సింహమువలెవానిపైకురికి "ఏమిజరిగినను జరుగును గాక మీలోనొక్కరినైనను బలిపుచ్చుకొనినగాని నేనుజచ్చువాడను గాను" అనిగర్జించెను అంతటితో నధికారుల దుర్నయములు కొంతవరకు శాంతిజెందెను.

సావర్కారు మరల బంధింపబడెను. ఆతడు పూర్తిగా నలసి పోయెను; నోట మాటరాకుండెను; ఊపిరి తిరుగకుండెను; క్షయ వ్యాధి మరల తలసూపునట్లు గాన్పించెను; అజీర్ణమువలన గొంత మనోవేదన గలిగెను; [illegible] [illegible] సంభవించునను భయము దోచెను; తమ్ము బెట్టిన బాధలకు పగదీర్చుకొందుమని యధికారులు బెదరించుచుండిరి. స్త్రీ [illegible] [illegible]; పారిపోవలె ననెడు యాశ లన్నియు వృథయయ్యెను: రాత్రి [illegible]డెను. రేయింబవలు లతనికి సంకెలలు వేయబడెన, బయటకు బోవునపుడు గూడ వారతనిని రెండు ప్రక్క లను బట్టుకొని యుండెడివారు నాలుగడుగుల గదిలో నతడు కూర్చొనవలెను; నిలువవలెను; యిటునటు దిరుగాడవలెను; సూర్య రశ్మికూడ యతనికి గరవయ్యెను; అధికారులు క్రోధానలములను గ్రక్కుచు దూషించుచు భయపెట్టుచుండిరి ఒకకత్తి యతని యెదుట వ్రేలాడ గట్టబడెను అతని సమీపముననున్న నొకకొయ్యపై దట్టింపబడిన రివాల్వరుతో నొకపరాయి సిద్ధముగా నుంచబడెను. ప్రయాణీకులం దఱు నచ్చోటును వీడి యారాత్రి మరియొకచోటుకు బోజొచ్చిరి; అధికారులు చేయనున్న దుండగముల కివి సూచనలని సావర్కారు గ్రహించి రానున్న విపత్తునకు సిద్ధపడియుండెను.

రాత్రియంతయు సావర్కారు మేల్కొనియే యుండెను; కాని కండ్లుమాత్రము మూతలువడు చుండెను. ఒక యధికారి సావ ర్కారుపై రూక్షవీక్షణములను బరపి "ఈసావర్కారుజాతి యెట్టి జాతియోగదా" యని హుంకరించెను సావర్కారు కన్నులవిప్పి చూచి యూరకుండెను. ఊరకుండుటచే నతడు లొంగిపోయెనని అధి కారి భ్రమపడి తిట్టుట ప్రారంభించి యమబాధలకు పాల్జేసెదమనిభయ పెట్టెను. సావర్కారు చటాలున లేచి యిట్లనెను. "చంపెదము, పొడిచెదము అను పెద్దపెద్ద కబుర్లు చెప్పవద్దు. విప్లవ మని మీరు పిలుచునట్టి యుద్యమము నేనాడు నేను ప్రారంభించితినో యానాడే మొట్టమొదట నాకొంపనంటించుకొని నాచుట్టు ప్రక్కల నున్నవారి కొంపలను గూడ నంటింప నారంభించితిని. ప్రాణములతో నున్నను నామట్టుకు నే నిపుడు జచ్చియే యున్నాను. ముందు వెనుకల నార యని సాహసమే నాకిప్పుడు పరమమిత్రము. మీవిషయము మాత్ర

మట్లుగాదు. మీరింకను జాలకాలము జీవించి పుత్ర, మిత్ర, కళత్రాదులతోడను, ధనకనక వస్తువాహనములతోడను బ్రతుక దలచుకొనిరి. కనుక మీరు నాకెట్టి యపకారమును గావింపబూనినను బాగుగ నాలోచించి చేయగోరుచున్నాను. మీయందరితో నేనొక్కడను బోరాడజాలనని నేనెరుగుదును కాని యిదిమాత్రము మామ్మాటికిని సత్యము మీలో నొక్కరికైనను గడతేర్చినగాని నేను మీచేజచ్చువాడనుగాను" అని చెప్పుటేగాక అవసరమైనచో దనయెదుట వ్రేలగట్టబడిన పరాయిలో దట్టింపబడియున్న రివాల్వరును లాగి తనశత్రువులపై నురుకుటకు గృతనిశ్చయు డయ్యెను. సావర్కారు పెదవుల నుండి యీయగ్నికణములు రాలుటతోడనే కుక్కిన పేనువలె కిక్కురుమనకుండ యూరకుండుటేగాక నాయధికారి వినమ్రుడై సావర్కారు నిట్లు బ్రతిమాలుకొనెను. "నేనుతిట్టుతిట్టు స్వభావము గలవాడనుగాను. ఈయన్నిరోజుల నుండియు నేను మీపట్ల చాల గౌరవముగనే ప్రవర్తించితిని. కాని నాకెట్టి సంకటములను తెచ్చిపెట్టుట మీకు న్యాయమైన పనిగాదు! మీరు నాయుద్యోగమును బోగొట్టి నాభార్యాబిడ్డల నోటియన్నమును బడగొట్టిరి! నా పొట్టపై గొట్టుటచే నేను విచారగ్రస్తుడనై కడుపు మంటచే తొందరపడి తూలుమాటలను జారవిడిచినమాట సత్యమే!"

అంతటనుంచి యధికారుల దౌర్జన్యమును దలపెట్టుట మానివేసిరి. వ్రేలాడ గట్టబడిన కత్తి మాయమయ్యెను. పరిస్థితులన్నియు నిమిషములో మారిపోయెను. ప్రభుత్వ హస్తమునుండి తప్పించుకొనుటయు తన యద్భుత సాహసకార్యము ప్రపంచమంతటను మారుమ్రోగి భారత రాజకీయములు ప్రపంచ సమస్యగా మారుటయు జరుగునని సవార్కారాశించెను చివరకీరెండును గూడ నిష్ఫలములైనట్లతడు తలంచెను. స్టీమరు ఏడెను జేరుసమయమున సముద్ర మల్లకల్లోలముగా నుండెను. అతనిలో గొంతయాశ యుదయించ నతడు సముద్రునిట్లు ప్రార్థించెను. స్టీమరు కొట్టుకొనుచుండెను. ఉష్ణ మధికమగుచుండెను. జీవితము భారముగా కాన్పించెను. ఇక జీవించుట నిష్ప్రయోజనము విజయధ్యానములచే విర్రవీగు శత్రురథచక్రములనలంకరించుటకు నేనొల్లను! మృత్యువా! రమ్ము! సముద్రమా! లెమ్ము!

నీయమోఘ తరంగముల యాలింగనభాగ్యము నాకు బ్రసాదింపుము! నాతీరములకు గొంపొమ్మని నిన్ను నేనొకసారి ప్రార్థించితిని నీవు నా విన్నపముల నాలకించితివి. కాని యది మరింత సంకట ప్రాయమయ్యెను! కనుక నిప్పుడు చనిపోవుట కైనను నాకు దోడ్పడుము. నీయుగ్ర స్వరూపమును నాకొక్కసారి చూపినన్ను నీకడుపున దాచుకొమ్మ! ఈవిధముగా నైన నద్భుతపడి నన్ను చెరబెట్టి హింసింపుచు నాపై బగదీర్చుకొనుటచే దనివి జెందవలెనని యాటలూరుచున్న నా శత్రువునుండి కాపాడుము!"

చివరకు స్టీమరు బొంబాయి చేరెను. చేతులకు సంకెలలను తగిలిచ్చి విచ్చుకత్తులు బారులువెట్టి సావర్కారును క్రిందకుదింపిరి. వెంటనే మోటారులో నెక్కించి యతనినొక రైలుబండిలో తలుపులు కిటికీలు బిగించి నాశికకు దీసికొనిపోయిరి. కేసు అగునరకు నతనిని నాశిక జెయిలులో నుంచిరి; మోకులతో జేతులనుగట్టి రక్షకభటులతనిని నాసిక వీధులలో ప్రజలందరును జూచునట్లు త్రిప్పిరి అతినమ్మకమైన రక్షకభటులను మాత్రమే కాపుంచిరి. సావర్కారుయొక్క సాహస కార్యమప్పుడే ప్రపంచ మంతటను మారుమ్రోగెను. అతని ధైర్య స్థైర్యములను బ్రతివారును గొనియాడ జొచ్చిరి. ఫ్రెంచి ప్రభుత్వము వారు సావర్కారును దమకు తిరిగి వప్పజెప్పవలెనని యాంగ్ల ప్రభుత్వమునకు ఫర్మానాపంపిరి ఎంత కావలాయున్నను జయిలులోనున్న సావర్కారున కీవార్తలన్నియు నెప్పటికప్పుడు వచ్చుచుండెను. మాజినీగారి బాల్డిలకు దలదాచుకొనుటకు జోటిచ్చితిమనియు రాజకీయ స్వాతంత్ర్యము కొరకు బోరాడు నస్వతంత్రజాతులను రక్షించుటకు వీరకంకణమును దాల్చిన జగట్టీలమనియు బీరములను గొట్టు యాంగ్ల రాజనీతి తమ నిరంకుశ ప్రభుత్వ పదతాడనముల నుండి రక్షించుకొన జూచుచున్న భారతదేశ సమస్య వచ్చినపుడెట్లు 'పిల్లిమంత్రములను' గొట్టి యంతర్జాతీయ ధర్మమును విడనాడుటచే యూరపు, అమెరికాలలో నగుబాటుకా దొడ్చెను చీనా మొదలు ఈజిప్టువరకును బ్రపంచ మంతయు సావర్కారు జీవితములతోను చర్యలతోను బ్రతిధ్వనించెను. ఎచ్చటజూచినను సావర్కారు పటములే. అతనిని మాజినీ, కసూతు

మొదలగు వీరులతో బోల్చుచు ఫ్రాన్సులోనున్న పత్రికలన్నియు నతనినెట్లైన ఫ్రాన్సుకు దిరుగ రప్పించుటకు విశ్వప్రయత్నములను, జేసెను. కాని ఫ్రాన్సు జర్మనీలమధ్య వైరము పొసగు ననుభయముచే నింగ్లండుతో గూడ నీ కారణముచే నిట్టిసమయమున వైరము తెచ్చుకొనుటకు జంకి ఫ్రాన్సు అంతర్జాతీయ సభయైన హేగుసభ కీవిషయమును విడనివేసెను. విప్లవనాయకులు కొందరు హేగుసభకుపోయి భారతదేశ సమస్య నన్నిజాతులవారికి నెరుకపరచిరి. జయిలులో నుండియే సావర్కారు పంపించిన వ్రాతమూలము హేగుసభలో పంచిపెట్టబడెను.

ఈ వార్తలన్నియు సావర్కారుకు దెలియుచుండెను "ఇప్పటికి నేను ధన్యుడనైతిని! నావిడుదల విషయమై నాకెట్టి చింతయు లేదు కష్టములను మృత్యువునుగూడ నేనే కోరుకొంటిని నే నాయన్నింటికిని సిద్ధముగనే యున్నాడను కాని నానిర్బంధ మాంగ్లప్రభుత్వమును గజగజలాడించి నాయభినవ భారత సంఘాధ్యక్షపదవిని సార్థకము జేసినదని నేనెంతయో గర్వపడుచున్నాను శెభాష్! ఇటాలియను, రష్యను విప్లవనాయకుల సాంప్రదాయమున కిదియెంత మాత్రమును దీసిపోవునది కాదు! నాయాత్మ శాంతించినది" అనియతడు గర్వపడెను.

సావర్కారును భారతదేశమునకు దీసికొనివచ్చిన యుద్యోగి పదవి తగ్గించి వేయబడెను; ఫ్రెంచి పోలీసువానికి జయిలు ప్రాప్తమయ్యెను. భారతదేశములో విప్లవోద్యమము నణచివేయుటకు ప్రత్యేక ఆక్టు తయారు చేయబడెను. దానికి పీలు లేదు; జ్యూరీ లేదు.

ఇట్టికట్టుదిట్టములతో మూలసిద్ధాంతములు గాలికెగుర గొట్టబడి సావర్కారు మొదలగువారి నేరములు విచారింపబడెను. సావర్కారు నన్నివైపులను మూసివేయబడిన మోటారులో హైకోర్టుకు తీసికొని వచ్చిరి. అతడు ఖయిదీలను విచారణచేయు రంగస్థలమా నెక్కుట తోడనే హర్షధ్వనులు చెలరేగెను. గాలరీలలోను వసారాలలోను ఒక్కపిట్టయైన లేకుండ ఖాళీ చేయబడెను. కాని ముప్పది నలుబది మంది యువకులతనికి స్వాగతము నొసంగిరి. వారుగూడ నతనితోడి

ముద్దాయిలే! వారును పడరానిపాట్లను బడిరి! అనేక హింసలకు లోనైరి! సావర్కారు పరిచయములో బంధువులో లేక మిత్రులో యగుటే వారు గావించిన మహాపరాధము. ఎటులైన వారినుండి సావర్కారుపై నేరములను లాగవలెనని సర్వప్రయత్నములును జరుపబడుచుండెను. ఇట్టిస్థితిలోకూడ సావర్కారును జూచుటతోడనే వారి శరీరము ఉప్పొంగెను. సావర్కారు ప్రజానాయకుడు. వేనవేలు ప్రజలతనిని యూరేగింపులతోను, భజనలతోను, యుత్సవములతోను బ్రహ్మరథమును బట్టిరి కాని యీయన్నింటికంటె నీయువక బృంద మిచ్చిన స్వాగతముచే నతడానంద పరవశుడయ్యెను. ఆయువకులలో నారాయణ సావర్కారు గూడనుండెను! నాలుగేండ్లక్రితము పదిహేను వత్సరముల బాలుని సావర్కారు విడిచివెళ్లెను. సావర్కారు వాని నానవాలు బట్టగలడో లేడో యని పరీక్షించుటకు వారతనిని నితరులతో గలిపివేసిరి. సావర్కారు వానిని మొదట నానవాలు బట్టజాలక స్నేహితులందరును దమలో దాము నవ్వుకొనుచుండ గొంతసేపటికి గుర్తుపట్టెను.

ఇంతలో కేసు విచారణ ప్రారంభమయ్యెను, సావర్కారు విచారణలో బాల్గొన నిరాకరించెను. తా నెట్టి తప్పిదమును జేయక పోయినను దాను ఫ్రెంచిన్యాయముక్రింద నుండెననియు, నంతర్జాతీయ ధర్మములను తుంగలోనూరద్రొక్కి తన్ను బలవంతముగా దీసికొనివచ్చుటచే దానీజబర్దస్తీవ్యవహారములో బాల్గొనజాలననియు నతడుస్పష్టపరచెను. భారత దేశములోనియాంగ్లాధిపత్యమును దా నంగీకరింపజాలనని చెప్పి యూరకుండెను. ప్రాణము మీదకువచ్చు విషయములు చర్చకు వచ్చుచున్నను సావర్కారు మాట్లాడక తన స్నేహితులపై వచ్చు నేరములకొర కాతురతపడుచు, విషయములను వ్రాసికొనుచు, క్రాసుపరీక్షలకు దయారుచేయుచు, యమబాధలనుపెట్టి తప్పిదములను లాగికొనిరని చెప్పినవారిని వానినన్నింటిని తగ్గించుకొనుడని హెచ్చరించుచు తానెట్టి క్రాసుపరీక్షను జేయక తనదీక్షనే పాటించెను.

సావర్కారు భారత దేశమునకు పందలకొలది రివాల్వరుల కట్టల నెట్లు రహస్యముగా బంపించెనో, అందు కెట్టి మాయోపాయములు పన్నబడెనో, వేగులవాండ్రు, ఓడరేవులలోని సుంకములను

పనులు జేయు నధికారులు మొదలగు వారి కండ్లముందరనే వీనిని దీసి కొనిపోయిన ధీరులెట్టివారో, మహారాష్ట్రము, బంగాళము మొదలగు రాష్ట్రములలో బాంబుఫ్యాక్టరీ లెట్లు స్థాపింపబడినవో, కన్యకలుగూడ నౌకర్లుకప్పుడెట్లు బాంబులు మొదలగు ప్రేలుడుసామానును దీసికొని పోయి దాచుచుండెడివారో, కన్యకల రహస్య సంఘములు గూడ నిరోధుల సంఘములతో గలసి యెట్లుపని చేసెనో మొదలగు ననేక రహస్యములు బహిర్గతము గావింపబడెను. ఒకమూల విచారణ జరుగు చుండగనే రక్షకభటులు మాట్లాడకూడదని వారించుచున్నను వారు విప్లవ ప్రచారమును గూర్చి తమలోతాము చర్చించు కొనుచుండిరి. సావర్కా రిదివరకభినవ భారత సంఘసభ్యులు కాని వారినందర నా శిబిరములో జేర్చుకొనుచు విప్లవ సిద్ధాంతములను వారి కెరుకబరచు చుండెను.

తీర్పుచెప్ప వలసిన దినమువచ్చెను; నలువదిమంది ముద్దాయిలు కిలకిలలాడుచు దమలో దామెకసక్కెములాడు కొనుచు "నేటియం త్యపరీక్షలో" ను తీర్ణులగు వారెవరాయని తర్కించు కొనుచుండిరి. యావజ్జీవ దేశాంతరవాస శిక్షను సంపాదించుకొను వారు 'మొదటితరగతి'లో ను తీర్ణుడనియు, దక్కువశిక్షలవారు 'రెండవతరగతి' మొద లగు తక్కువ తరగతి యనియు నంగీకరింపబడెను. ఏమియు శిక్షపడని వారు పరీక్షతప్పిన మొద్దబ్బాయిలు! మొట్టమొదట నాయకుడైన సావర్కారుకు దేశాంతరవాసము విధింపబడెను. సావర్కారులేచి 'వందేమాతరం' అను యాహావరవముతో దానిని శిరసావహించెను. ఇట్లు దేశాంతరవాసములు కఠినశిక్షలు మొదలగునవి వరుసగా విధింప బడెను

వెంటనే రక్షకభటులు ఖైదీలపైబడి సావర్కారు చేతులకు సంకెలలను దగిల్చి తీసికొని పోవుచుండ నతడు తన టోపీని విసరుచు నిక యాజన్మములో కలుసుకొనుట కవకాశము లేనితన భటావళినుండి కడసారిసెలవు గైకొనెను!

## తీర్పులోని కొన్నిసారాంశములు.

1906లో పూనా, నాసికలలో స్వాతంత్ర్యావేశమును ప్రజలలో లుగజేయుటకును, విదేశప్రభుత్వముపై ద్వేషమును రిగుల్కొల్పుట, కును సావర్కారుపన్యాసముల నిచ్చుచు, మానసిక శిక్షణము వలనను_

శారీర పరిశ్రమల వలనను విప్లవమును విజయప్రదము గావింపవచ్చు
నని ప్రచారము చేయుట.—

1909 లో జాక్సనుహత్య జరిగినతరువాత గణేశ సావర్కారిం
టిని సోదాచేసినప్పుడు 1776 – 1876లలోని యూరపియను విప్లవ
ములనాటి రహస్య సంఘములనుగూర్చి ఫ్రాన్సు వ్రాసిన ప్రతియొకటి
దొరకెను. అందులో రషియను విప్లవకారులెట్లు రహస్యముగా చిన్న
చిన్న మండలములను స్థాపించిరో, ఆమండలము లన్నియు నెట్లు
ప్రత్యేక భాగములుగా విభజింపబడినవో, యేమండలమువారిని సభ్యు
లామండలము వారికేగాని యితరులకు తెలియకుండా నెట్లుండెడి
వారో మొదలగు విషయములు కలవు. దీనిని బట్టి ఇట్టిసంఘము అనే
కము లేర్పడినట్లును, వారందరును నొకేయుద్దేశ్యముతో పనిచేయు
చున్నట్లును, వివిధమండలముల వారొకరినొకరు రెరుగక పోయినను
యొకచోటనుండియే యాయుధములను సేకరించుకొనుచుండినట్లును
తెలుచున్నది.

మాజినీజీవితమును వ్రాయుట, అందులో సావర్కారు వ్రాసిన
యుపోద్ఘాతము విప్లవమును స్పష్టముగా ప్రేరేపించుచున్నది.

అతడు యూరపులో జరిపిన చర్యలు :— దీనికి1908 మే
మొదలు 1909 ఫిబ్రవరి వరకును 'భారత గృహములో పనిచేసిన చతు
ర్భుజుడను వంటలవాడును, నొక యింజనీరింగు విద్యార్థియు, లండ
నులో సావర్కారుతో స్నేహము చేసినమరి యొకడును; సావర్కారు
వద్దగాని యతని స్నేహితులవద్దగాని దొరికిన కాగితమును; అతడు
వ్రాసిన కాగితములును సాక్ష్యములు పైనచెప్పబడిన లండను సాక్ష్య
ములలో దీనిని కూడ త్రోసిపుచ్చుటకు వీలులేదు. "భారత గృహము"
లోని విప్లవ పక్షము వారి కతడు నాయకుడని యవన్నియు ఋజువు
చేయుచున్నవి. అతడు "భారత స్వాతంత్ర్యయుద్ధము" అని నామ
కరణమిడి 1857లోని భారతవిప్లవ కారుల చరిత్రను వ్రాసెను. అవిప్ల
వములో చనిపోయిన విప్లవకారుల నందర నభినందించుచు 'ఓ దేశ
భక్తులారా'యను యుద్రేకమును రగుల్కొల్పు కరపత్రములను భారత
దేశమునకు బంపెను. అతడును 'భారతగృహము' లోనివారును గలసి
బాంబులను తయారుచేయు విధమునుగురించి పుస్తకములను టైపుకొట్టి
భారత దేశమునకు బంపిరి. అతడభినవభారత సంఘము వారినుండి

ప్రమాణములను గైకొనుచుండెడివాడు. ఈ సంఘమునకు శాఖలు ప్రపంచమంతటను కలవని యతడు చెప్పినట్లిద్దరు లండను సాక్షులు చెప్పుచున్నారు.

1908 లో ఆఠవలె బ్రాహ్మణుడు భారతదేశమునకు పోవునప్పుడు సావర్కారతనిని 20 బ్రౌనింగుపిస్తోళ్లను, కొన్ని తోటాలను తన పెట్టెలో దాచి తీసికొనిపోయి బొంబాయిలో నొకరి కిమ్మని బలవంత పరచెను. మరియొక సాక్షి 1910 లో భారతదేశమునకు పోవుచుండ నతడిట్లే బలవంతపెట్టెను. కాని యతడొప్పుకొనలేదు. చివరకొక్క పిస్తోలు నతనికి బలవంతముగా కట్టబెట్టెను.

చతుర్భుజున కిచ్చిన పిస్తోళ్లను, బాంబునుగురించి వ్రాసిన ప్రతులున్ను భారతదేశము చేరెను. గణేశసావర్కారు యింటిలో నా ప్రతియొకటి దొరకెను. పారిసులోనున్న భారతరాజద్రోహసంఘముతో సావర్కారు సంబంధము కలదు. చండేరీరావు నరెస్టుచేసినపు డతనివద్ద 'వందేమాతరం' ప్రతులు దొరకెను. కర్జనువిల్లీనిచంపిన ఢింగ్రాను స్తుతించుచునవి వ్రాయబడెను. వానిని సావర్కార్ యతనికిచ్చెను. ఆకరపత్రము రాజకీయహత్యలను ప్రోత్సహించుచుండెను దాని నతడే వ్రాసినను వ్రాయకపోయినను భారతదేశములో నతడిట్టి ప్రచారమునే చేయుట కుత్సహించుచుండెను. "ఉద్యోగస్తులను చంపివేసెదమని భయపెట్టెను. దానితో నిరంకుశప్రభుత్వ యంత్రమున కపసావకాల మాసన్నమగును. ఖుదీరాంబోసు, కన్నైలాల్ దత్తా మొదలగు యోధులచే దేదీప్యమానముగా ప్రారంభింపబడిన యీ పద్ధతినే నిరంతరము సాగించితిమేని భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వము త్వరలోనే యంతరింపగలదు. ప్రజలలో నుద్రేకము రగుల్కొల్పుటకును, ప్రభుత్వమును నిర్వీర్యము చేయుటకును నిట్టి ప్రత్యేక ప్రత్యేకహత్యలే శ్రేయస్కరమైనవి. ఇవియే విప్లవమునకు ప్రథమసోపానము" అనునిట్టి ప్రబోధము లనేకము లందులో గలవు.

వినాయక దామోదర సావర్కారు: — "రాజద్రోహమును గూర్చిన సమ్మెసలో వినాయక సావర్కారు చర్యల నేకములు చర్చింపబడెను గనుక నతనికేసును ప్రత్యేకముగా విస్తరించి చర్చించుటనవసరము 'భారతగృహమున' కతడు యాజమాన్యమును వహించిన రోజులలో భారతదేశమున పంచిపెట్టబడిన యొక కరపత్రమును నిచ్చట దాఖలుచేసెదము. దానిలోని విషయమునుబట్టి చూడ నది లండనులో

విప్లవకారుల యుత్సవములను జరిపిన నాడు వ్రాసినట్లు కాన్పించిను. ఈ కేసులో దాఖలు చేసిన ప్రతి కాశికరు గృహమును సోదా చేసినపుడు దొరకెను. దానిని మరియొక ముద్రాయి వినాయక సావర్కారు వద్ద తీసికొని కాశికరు కిచ్చెనట. అది బ్రిటిషు ప్రభుత్వముపై ఘోరా పహోరీ యుద్ధమును ప్రకటించుచుండెను. అందులో నొకవాక్య మిట్లున్నది. "యుద్ధము 1857 వ వత్సరము 10 మే తేదీని ప్రారంభమయి 1908 మే 10 వ తేదీ కింకను ముగియలేదు, మరియొక మే 10 వ తేదీ చరమావధిని చూచువరకు నీయుద్ధ మాగునది కాదు" దురోభ్యనవల చేతను, యుద్ధమునకు పురికొల్పునట్టి ప్రతులను పంచిపెట్టుట చేతను, ఆ యుధములను సరఫరా చేయుట చేతను, ప్రేలుడు సామగ్రిని తయారు చేయు విధమును ప్రచారము చేయుట చేతను ముద్దాయి యుద్ధమును పురికొల్పుటచే దోషియని మేము తీర్మానించుచున్నాము కనుక నతడు 121 సెక్షను (ఎ) ప్రకారము శిక్షార్హుడు.

## —తీర్పు

వినాయక దామోదర సావర్కారుకు:—కోర్టువారు నీపై యావజ్జీవ ద్వీపాంతరంవాసమును; నీయావదాస్తిని ప్రభుత్వము వారు వశపరచుకొనునట్లును శిక్ష విధించుచున్నారు.

ఈ శిక్ష చాలక సావర్కారుపై జాక్సను హత్యను ప్రోత్సహించెనను మరియొక నేరము తేబడెను. దీని కురిశిక్ష విధింపబడునని చాలమంది తలంచిరి సావర్కా రెంతమాత్రమును జలింపక వెనుకటి వలెనే భారతదేశముయొక్క యాంగ్లాధిపత్యము నంగీకరింపజాలనని వాదింపుచుండెను. హేగుసభలో యావత్ప్రపంచ దృష్టిని సావర్కారాకర్షించుట చేతనో, మరేకారణముననో యురిశిక్షను మానిజేసి న్యాయమూర్తు లతనిపై మరియొకసారి ఆశిక్షనేవిధించిరి. "త్యాగము కష్టసహిష్ణుత మాత్రమే నేడు గానిచో రేపైనను భారతమాతకు మోక్ష సామ్రాజ్యమును జేకూర్పగలవను దృఢవిశ్వాసముతో మీధర్మశాస్త్రములు విధించు నెట్టిదారుణశిక్షనైన నతి సంతోషముతో నాలింగనమొనర్చుటకు నేను సిద్ధముగ నున్నాను" అని సావర్కారు వచించి చేతులకు సంకెలలు తగిల్చి శస్త్రపాణులైన రక్షకభటు లతనిని కోర్టునుంచియు ప్రపంచదృష్టినుంచియు దొలగించుచుండ దేశమాత నిట్లారాధించెను.

## — మొదటి వాయిదా —

తల్లీ! ఈ నీ చిరతబిడ్డల యొల్లనేన నంగీకరించ జేయుచున్నా ము తల్లీ! నీ ఋణమును దీర్చుకొనుటకు మే మెంతటి వారము!

నీవు మమ్మాశీర్వదించితివి! మాకు స్తన్యమునిచ్చి ఘనుల నొనర్చితివి!

మే మీరోజున నీ యజ్ఞకీలలలో ప్రవేశించుచున్నాము! నీ ఋణ మొకక్క మొదటి వాయిదాను చెల్లించితిమి! మేము తిరుగ పునర్జన్మమెత్తి [illegible] ల నెత్తుచున్న యజ్ఞదేవత సంతృప్తిపొంది నీకు జయము చేకూర్చునదాక నిట్లే యాత్మార్పణము జేయుచుందుము.

కాళిందీమార్గమున కంసారి యైన శ్రీకృష్ణుడు నీ విజయ సారథ్యమును వహించియుండ దశరథరాముడు నాయకుడై యుండ, ముప్పది కోట్ల ముద్దుబిడ్డలు యోధులయి నీ ధ్వజమున జేత బూనుచుండ మేము వారలమైనను యీ దివ్యచమూప్రవాహ మాగునది కాదు! తల్లీ! అది చరచర ముందుకు బోవుచు ఆ శత్రుకులము సమగ్రముగా నిర్జించి నీ దివ్య దక్షిణహస్తముతో స్వాతంత్ర్య, ధర్మపతాకమును విజయాంకిత లక్షిత హిమనగశిఖరములందు స్థాపింపకున్నె!"

## — అండమాను రంగము —

సావర్కారు అండమానుదీవులకు పంపబడెను; ఇవి బంగాళా ఖాతములో గంగాముఖమున కయిదువందల తొంబది మైళ్ల దూరమున గొలుసులు గొలుసులుగా నుండు ద్వీపసమూహము ఇవన్నియు కొండల తోను మనుష్యులు చొరరాని కీకారణ్యములతోను నిండియుండును ఇచ్చట సంవత్సరమున కెనిమిదిమాసములు హోరున వర్షించుచుండ పిడుగుల సన్నిభములగు మేఘములు పైకెగయుచు, చిమ్మచీకటులతో నాకసమును గప్పుచుండును. ఈగలు ఝుమ్మని మూగుచు మనుష్యులను తగిలినచో వెంటనే వారి పెదవులను బలగలు మారేదుపాదు నయుండెడి మనుష్యులను భీకరముగా సిద్ధముగా నుండును. దోమలకు లేదు అవిమన చిన్న గొల్లభామలంతంత (grassh oppers)యు

వృద్ధికిని, మానవాత్మకళ్యాణమునకును తోడ్పడునని ఋషులును, పూత
చరిత్రులును వచించిరో దానినే మనుష్యధర్మముగా స్వీకరించితిని.
ఇట్టి మానవధర్మ నిర్వహణములో నొక్క మనుష్య మాత్రు డెంతవని
నిర్వహింపగలడో యంతవనిని గష్టతరం బరలను సహించి, నాకున్న
పరిమితులనుగూడ ధిక్కరించి సాధించితిని. నాదీక్ష కాటంకములను
గల్పించు పిరికి తనమునకు నేనెన్నడును చోటిచ్చి యుండలేదు. కులీ
నత; అవ్యంగమైన శరీర సౌష్ఠవము; కంటికి రెప్పవలె గాపాడిపోషిం
చిన జనకుడు; కరుణారసమూర్తియైన తల్లి, త్యాగ, కష్టసహిష్ణుతలకు
నిధియై ముందడుగు వేయుచు దల్లికంటె నాప్యాయతను జూపు జ్యేష్ఠ
సోదరుడు; సమర్థుడు, వినమ్రుడు, భ్రాతృవత్సలపరాయణుడునైన
కనిష్ఠసోదరుడు; ప్రియాదర్శయును లేనిచో గడుహాయముగా బహు
ప్రాయముగా వెన్నువేయునట్టి యీస్వల్ప మానవ జీవితమును
సార్థకము చేయుచు, వాడిద మోత జీవితమున కొకింత
వన్నెదెచ్చి ధైర్యసాహసకలాపముచే విశుద్ధశీలమును బ్రసాదించు
మహాదాదర్శము మొదలగున వన్నియు నాకు బ్రసాదింపబడినవి.
జ్ఞానులు, పరమ పవిత్రులు మొదలగు ఋషిపుంగవుల వంటివారితో
గూడి అపరాత్పరుని పదకమలములను సేవించు భాగ్యము కొంత నా
కబ్బినది. కీర్తి కాంతను గూడ గొంతవరకు నేను జవి చూచితిని నే
నెన్ని పవిత్రతోయములను బానము చేసితిని; నానాపుణ్యభూములు
పుణ్యనదులు, పుణ్యారామములు మొదలగువాటి సౌరభము నాఘ్రాణించి
తిని, ప్రజ్వలిత తాపసాగ్ని మొదలు ప్రియజనాశ్లేషసౌఖ్య[illegible]ము
వరకును జీవితములోని శీతోష్ణ సమసుఖదుఃఖముల ననుభవించితిని;
మృదు మధురవీణాశ్రుతి మొదలు మృత్యుసమ్ముఖమునకు బోవపోవుడు
శృతికఠోరమగు గురగురధ్వని వరకు నాలకించితిని. స్త్రీలను, పురుషు
లను, దేశములను జాతులను, ఖండములను, ఖండాంతరములను మొద
లగు విభిన్నరంగముల నీ భూతల చిత్రప్రదర్శనశాలయందు తిరుగాడుచు
గాంచితిని పృథ్వీ! అట్టి నా యీ నేత్రద్వయము నొక్కసారి
ముగ్గిచేసి నీమనోరథము నీడేర్చుకొనుము!

కాని నాయౌవనసౌభాగ్య మంతయు నడవిని గాచిన వెన్నెల
చంద మాయెను!

కూడా దను భావముచే నొక్క యడుగైనను ముందుకు వేయజాలక
స్థాణువువలె నిలిచి పోవుచుండెడివాడను. ఒక్కొకప్పుడు నాతోడి
ఖయిదీలవద్ద భోజనమునకు కూర్చొనినప్పుడు వర్ణింపతరముగాని భావ
ప్రపంచములో నన్ను నేను మరచిపోవుచు "ప్రతిబీజమును ప్రాణియే
కదా! ప్రతిప్రాణియు వృద్ధిపొందుచు ప్రాణములతోనుండ నుత్సహిం
చుటలేదా? వి నీవిధముగా చంపివేయుట శిశుహంతతో సమానమై
నదికాదా? ధాన్యపుగింజ యైనను గోధుమగింజయైనను మరియొక ఫల-
మునకు బీజముగుటలేదా?" అను భావములతో నన్నుప్రముద్ద నోట-
బోకుండ నాగిపోయెడిది! ఇట్టి విశ్వప్రేమతో, విశ్వైక్యబుద్ధితో నేను
చేయుచోవు ప్రతికార్యమును బరీక్షించుకొనుచు, నీప్రపంచములో నే-
జీవకోటికిని హానిచేయరాదను సూత్రమును పాటించుట యసంభవ-
మనువిచారము బాధించుచుండ, నైతిక సత్యము లింతయస్థిరముగా-
నుండ, గాటిపిల్లికొనుటే జీవహింసయను కూలప్రపోటు హృదయ-
మును ప్రక్కలు చేయుచుండ, ప్రపంచ ధర్మమును మానవనీతిచే నెట్లా
సావము చేసికొన జాచుట దుర్లభ మనునిరాశ జనించుచుండెడిది.
ఒక్కొకప్పుడు నేనిట్టిభావముతో విచారగ్రస్తుడనై జడునిభంగి
చేష్టలు దక్కి యుండెడివాడను. ఆయినను నేనట్లాచరించుటకే నా
సర్వశక్తులను వినియోగించితిని. దీని నతిక్రమించుచో విధిలేకనో,
యజ్ఞానముచేతనో మాత్రమే నేనట్లు చేసితిని. కనుక నాకు లేశమా
విషయమైకూడ నెట్టివిచారము లేదు ఈవ్యాకృత్యతిరమును దాటు-
టెంతకష్టమోకదా! కాని యువతల నైపున గట్టులేని గట్టునున్న
పుణ్యపురుషులకును, గులీనులకును, రోగులకును గూడ శ్రీకృష్ణభగ
వానని రాయబారమును నాతో నేను గొంపోవుచున్నాను. "తమ
ధర్మము నకళంకముగా నిర్వహించిన వారెన్నటికిని వారిబాగుల్లు
గాజాలరు." ఇది యెన్నటికిని పరమసత్యము! ప్రకృతివాదులై,
నిరీశ్వరులైన ధర్మశాస్త్రమును మాత్రమే విశ్వసించువారు కూడ దీని నే
బలపరచుచున్నారు.

కనుక స్వర్గనరకములు, చావుపుట్టుకలు, బంధమోక్షములు
నొందలగునవి మనకర్మఫలముతే యని వచించు వాక్యములే నెక్కువగా
వెదల సదాచార, ధర్మశాస్త్రానుసారముగ నీలోకమందే తగినంతవరా-

ల్యము కొల్లంచబడుటచే మృత్యుకవాటముచే బహిర్గత మగుచుండు. నాగసృష్టినగరము నందనసమాన సౌధరాజము లిదివరకే నాకొరకు ప్రత్యే[illegible] బసియున్నవి.

ఓః స్వర్గనరకములు, బంధమోక్షములు ఆత్మానాత్మలు, ధర్మాధర్మములు, మొదలగున వన్నియు మనఃకల్పితములు మాత్రమే యగుచు నాకాశసౌధములగుచో, నాత్మకూడ యూహాజనక మగుచు నణువులును బహు అణువులును గలసిన యాధ్యాత్మిక, రసాయనిక వస్తుసమ్మేళనము [illegible]మే యగుచు దెలుగ విడిపోవుచుండు నెడల నదియును శుభ[illegible]మేకదా! అప్పుడు మృత్యువు గాఢనిద్రయైన గావలెను! లేదా మోక్షమే కావలెను! ఈ పంచభూతములు నీసమ్మేళనమునుండి విడివడి నూతన పరమాణువులు మరికొన్ని నూతన పరమాణువులతో గలసి మరియొక నూతనవస్తువు కావచ్చును; లేక శూన్యములో కలసిపోయి విస్మృతి జెందవచ్చును. బుద్ధియను గగనవీధి నొక్కసారి మెరుపుతీగవలె ప్రకాశించిన యీనాలోని "నేను" ప్రకృతిలో స్థగితమై, విశ్వాత్మకమైన "నేను" లో గలసి మాయమగునేని మృత్యువా! అప్పుడు నీవు మోహాదాయినివే యగుచున్నావు! కాని నాకొక్కటే కోరికయున్నది. నీవు రాదలచుకొన్నచో వెంటనే తడవుసేయక రాగోరుచున్నాను! నిన్ను జనులు ద్వేషించుటకును, నీవపఖ్యాతి పాలగుటకును నీస్వైస్వత గాని, నీనిర్దాక్షిణ్యతగాని కారణములు గావు! నిన్ను మా[illegible]చ్చి నీనిజస్వరూపమును మాకెరింగించినవా రెవరును నింతవరకు గాన్పించలేదు. [illegible] మహాత్మ్య శేఖరులగు శ్వాసకాసాదిరోగ పరివారమే నీదుర్యశమునకు గారకులు. వారంతక్రూరులు, అసహ్యస్వరూపులు; అతడయిన [illegible]యొక్కడిచేకాక యెట్టికోరికలును, యెట్టి ద్వేషములను నెరుగని శత్రుశూన్యుడైన యాబుద్ధదేవుడు గూడ నీపరివారమును ద్వేషించకుండ జాలడాయెను! "రోగము లేకుండుటకంటె మహాదాశీర్వాద మేమియును లే" దని ధర్మపథము చాటుచున్నది. నీవు నీ నానారోగ పరివారము నంతను నీపిలుపు నంగీకరించక నీతో యుద్ధ మొనరించిన యోధులపై ప్రయోగింపుము! లేనో! నాతలంపులను (నీకొరకే బుద్ధిపూర్వకముగా తెరచి యుంచకపోయినను) నీకే బలవంతముగా ప్రద్యోతించుచున్నాను! విజేతలమని విర్రవీగుచు, విరుగ

బయటనాదిక్కెల్లర పీనసుకంఠమనో యోధుండై విజేతా! రమ్ము! ఇక నెట్టి యుపోద్ఘాతములు నక్కరలేకుండ తత్క్షణమే రమ్ము!"

కాని యామృత్యుదేవత కేమిబుద్ధి పుట్టెనో గాని యది సావర్కారు పిలుపు నంగీకరింప దాయెను! అట్లని యతనిని పూర్తిగా విడిచిపోవుటకు నొల్లక చావుబ్రతుకులు గాని మధ్యస్థితికి దెచ్చి పరిహసించుచుండెను!

ఇట్లుండ రాజకీయ ఖయిదీలను విడిచి పెట్టవలెనని యాసేతు హిమాచల పర్యంతము ప్రతిరాష్ట్రీయ సభలోను తీర్మానములు గావింపబడుచుండెను; ఆంధ్రసభలలో ప్రతివత్సరము నిట్టి తీర్మాన మేకగ్రీవముగా నామోదింపబడుచుండెను. బొంబాయి, మహారాష్ట్రము, మధ్యవరగణాలు మొదలగు సన్నిచోట్లను ప్రజాందోళన హెచ్చయ్యె. ఉపన్యాసములలోను, పత్రికలలోను, జర్పెలలోను భారతదేశమంతటను ప్రజాభిప్రాయము బలపడుచుండెను. గొప్పగొప్పసభలు గావింపబడి వేలకొలది ప్రజలు ముక్తకంఠములతో ఘోషించిరి. మాంటాగు గారు రాజకీయ ఖయిదీలను విడిచి పెట్టెదమని వాగ్దానము చేసిరి. 75,000 మంది ప్రజల సంతకములతో పిటీషనులు గురిపింపబడెను. చివరకు వందలకొలది రాజకీయ ఖయిదీలను విడిచిపెట్టిరి.

కాని సావర్కారును మాత్రము ప్రభుత్వమువారు విడిచిపెట్టరైరి. ప్రజాందోళన మరింత హెచ్చుజొచ్చెను. "సావర్కారు వారములు" జరుపబడెను. భారతమహాజనసభలో గూడ నధ్యక్షుని చేతనే సావర్కారు విడుదల విషయమై ప్రత్యేక తీర్మాన మువపాదింపబడి యేకగ్రీవముగా నంగీకరింపబడెను. పల్లెలలోను, పట్టణములలోను నిట్టి తీర్మానములు వేలకొలది గావింపబడెను. 1923 లో జరిగిన కాకినాడ కాంగ్రెసులో గూడ సావర్కారు నింకను అండమాను దిబ్బలపాలు చేయుట యన్యాయమని తీర్మానింపబడెను; ఎట్టకేలకు కొన్ని షరతులతో సావర్కారును విడిచిపెట్టిరను వార్త వినుటతోడనే యావద్భారత దేశమును ప్రహృష్టాంతరంగులరా లయ్యెను! కాని యతడు [illegible] పరిసరములను దిరుగుటకు వీలులేదు. అతడు బొంబాయి రాజధానిలోని రత్నగిరిలో మాత్రమే యుండవలెనను. భారతదేశమంతయు నతనిని సత్కరించు భాగ్యము లేక పోయినను నతడు "సావర్కారు"

“నాసిక”యను గర్వపదమునుండి నాశికానగరమును ప్రవేశించినప్పుడు వేనకువేల ప్రజలు తూర్యారావములతోను, దివ్యమంగళహారతులతోను రాజకీర్ణములతోను యూరేగించి పుష్పవర్షమును గురిపించిరి. మహారాష్ట్ర దేశమంతయు నతని నుచితరీతిని సత్కరించి యొకనిధిని సన్మానపత్రమును సమర్పించి తనభక్తిని వెల్లడించెను.

“దేశభక్త వినాయక దామోదర సావర్కారు, బి. ఏ., బారిష్టరుగారికి —

మహాశయా!

భారతమాత నుద్ధరింప మీరు చూపిన యనన్యసామాన్యమైన నిశ్చలదేశభక్తికిని, దుర్భరకష్టపరంపరా సహిష్ణుతకును మిమ్మెన్నటికిని మరువజాలని మీ ప్రజ లీమంగళాప్రదమైన తరుణమున మిమ్మభినందింప వేడుకొనుచున్నారు.

మతము వలెనే రాజకీయములలో గూడ మన పరమావధిని జేరుట కనేకమార్గములు గలవు. మహాదాదర్శములను సాధించుటకు వివిధపరిస్థితులలో వివిధోపాయము లవసరమైనట్లును న్యాయమైనట్లును మనకు చరిత్రయే చాటుచున్నది

మీ ప్రజాహిత జీవితము (బాల్యమందే నిర్బంధింపబడుటచే) కొంచెము కాలములోనే సమాప్తిబొందినను యుత్సాహప్రబోధములతో గూడి దివ్యజ్యోతివలె ప్రకాశించి “మన్ను దిన్న పామువలె, కొండచిలువవలె, చిరకాలము పడియుండుటకంటె నొక్కసారి తటిల్లతవలె ప్రకాశించి ధన్యతనొందుటమేలు” అను మహాభారతసూక్తి కొంతయో తగియున్నది.

ఇట్టి యకుంఠితవిశ్వాసమే మానవుని యంతరాత్మ విధించు శాసనములను నిర్వహించుటకేకాక తన్నిర్వహణమందు తటస్థించునట్టి సంకటములనైన నెదుర్కొను శక్తినికూడ ప్రసాదించి పౌరుషబీజములను నాటుచున్నది.

యావజ్జీవద్వీపాంతరవాసమును దాటివచ్చుట నిజముగా నొక పునర్జన్మయే యని మా యభిప్రాయము. ఇంతేకాక పండమాను కారాగారములోని భీభత్సము నంతను భరింపగలిగి తిరిగి నేను బయటకు వచ్చుటతోనే ప్రజాహితధర్మమునందు పాల్గొన నుత్సహింపజేయు

మీ ధైర్య, స్థైర్య, శ్రమ, దమాది సద్గుణసంపత్తి యిక్కొద్భుతమైనదని మేము వేరుగ జెప్పనక్కరలేదు. మహారాష్ట్రమంతయు దీని కాశ్చర్య సంతోషమగ్నమానసమై కడుంగడు గర్వపడుచున్నది.

మే మర్పించుచున్న నిధి బహు స్వల్పమే యైనను మా యఖండభక్తి ప్రేమలను, నకుంఠిత విశ్వాస కృతజ్ఞతాగౌరవములను మీపట్ల వ్యక్తపరుపదలంచి మా యుడుతభక్తి నీ పత్రముఖమున వెలువరించుచున్నాము. మా విశుద్ధాంతఃకరణమును యోచించి మీ రీ నిధిని స్వీకరించి మమ్ము కృతార్థులను జేయ గోరుచున్నాము.

కారాగారము తప్పినను మీ రింకను ప్రవాసకంటకావృతులగుట తప్పదాయెను! అనతికాలముననే యదికూడ తప్పిపోయి మీరు మీ ధర్మమును నిర్విఘ్నముగా సాధించుకొనగలుగుదురు గాక! ఇట్టి మహదాశయముతో మహారాష్ట్రము మీకీ యల్పనిధిని సమర్పించుచున్నది. ఆ పరాత్పరుడు మీ కఖండైశ్వర్యారోగ్య భాగ్యమును, మార్కండేయాయుష్యమును ప్రసాదించును గాక!

# దేశీ ప్రచురణలు.

| | | |
|---|---|---|
| గాంధీప్రణాళిక, | అగర్వాలా | I-12-0 |
| గాంధీరాజ్యాంగం. | ,, | I-8-0 |
| విద్యార్థుల నిర్మాణకార్యక్రమం. | ,, | 0-8-0 |
| రైతులు-కమ్యూనిష్టులు - | రంగా | I-8-0 |
| జాతీయవిప్లవ పంథా | ,, | 1-0-0 |
| పాకిస్థాన్ | ,, | 0-8-0 |
| స్వాతంత్ర్య సమరం : సోషలిజం ,, | | 2-8-0 |
| | జయప్రకాష్ నారాయణ్ | |
| అహింసావిప్లవం | (కృపలానీ) | 0-8-0 |
| భారత జాతీయ కాంగ్రెస్ | ,, | 0-12-0 |
| నౌఖాలీనరకం | శ్రీనివాసరావు | 0-12-0 |
| యుద్ధానంతర విప్లవం | కామత్ | 0-I2-0 |
| ఇండొనేషియా | ఏడిద కామేశ్వరరావు | I-8-0 |
| ఈజిప్టు | అయ్యదేవర కాళేశ్వరరావు | 1-8-0 |
| జైలురోజులు | విజయలక్ష్మి పండిట్ | 1-8-0 |
| 42 అగష్టులో, జైల్లో రాలిన రత్నాలు | | 0-I2-0 |
| నిర్మాణ కార్యక్రమం | గాంధీ రాజేంద్రప్రసాద్ | 0-8-0 |
| ప్రజానాయకుడు ప్రకాశం | గొర్రెపాటి వెంకటసుబ్బయ్య | 0-12-0 |
| ఆచార్య కృపలానీ | ఏడిద కామేశ్వరరావు | 0-I2-0 |
| అరుణఅసఫాలీ | ,, | 0-I2-0 |
| ఝాన్సీలక్ష్మీభాయి | జగ్గన్నశాస్త్రి | 1-4-0 |
| వినాయక్ సావర్కార్ | ,, | 0-I2-0 |